విడిప్రతిక ౧అణా

# గోలకొండపత్రిక

**GOLKONDA PATRIKA**

The First Telugu Bi Weekly in Andhra Desa and the only Telugu New paper for H E H The Nizam s Dominions
HYDERABAD Deccan

103211

ప్రతి సోమ, గురువారములందు ప్రకటింపబడును

సం॥ చందా ౬ రూ | **Monday 19—8—1935** | అర్ధ సం॥ చందా ౩ రూ

సంపుటము ౧౦. | త్రూపుబజారు, హైదరాబాదు - దక్కన్. | Vol. 10
సంచిక ౨౯. | శా శ ౧౮౫౭ శ్రీ యువ సం॥ శ్రావణబ. ౬ సోమవారము ౧౭ మెహర్ ౧౩౪౪ ఫ. | No. 29.

# మరల సంస్థాన ప్రజా సంఘముల అనుమానములు

## భూలాభాయి గారి ప్రకటనలయెడ కోపము

## సంస్థాన ప్రజా సంఘ ప్రత్యుత్తరము

బొంబాయి: ఆగస్టు ౧౭:-

అఖిలభారత సంస్థాన ప్రజా సమావేశమునకు జనరలు కార్యదర్శులగు బలవంతరాయి మెహత, మణిశంకర త్రివేణిగార్లు ఈ క్రింది ప్రకటనను పంపిరి:—

సంస్థానములపట్ల వర్కింగు కమిటీ తెల్పిన వైఖరినిగాని, ఆవైఖరితో ఏకీభవింతుమని భూలాభాయి దేశాయిగారిటీవల వ్రాసిన లేఖను గాని మేమిప్పుడు వివరముగా పరిశీలింపము. కాని ఇప్పుడు రెండు ముఖ్య విషయములను మాత్రము తెలుపవలసి యున్నది.

వర్కింగు కమిటీ నిర్ణయముగాని, దేశాయిగారి లేఖగాని మేమడిగిన ప్రశ్నలకు సమాధానము చెప్పుటలేదు. మేమడిగిన సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యమును, ఫెడరల్ రాజ్యాంగమునందు పౌరసత్వహక్కులు అట్టివిలేని రాజ్యాంగమును ఆమోదింప వీలులేదని కాంగ్రెసు తీర్మానించవలెనని. ఈటి విషయమై వర్కింగు కమిటీ తీర్మానము స్పష్టముగా నేమియు తెలుపలేదు. ఇండియా బిల్లును సవరణల నొనరించి లాభము లేదని మాకు తెలుపుచున్నది. మేమట్లు కోరియుంటిమా? ఇండియా బిల్లును నిరాకరించుటలో కాంగ్రెసుకు మేము తీసిపోము.

దేశాయిగారు ఇటీవల వ్రాసిన లేఖలలో తాము బెంగుళూరులో తెలిపిన అభిప్రాయముపై చెలరేగిన వాదప్రతివాదములు శాంతించుగాక యనికోరిరి. సంస్థానప్రజలను మాటలచే ఇండియా బిల్లునుండి ఎత్తివేయవలె ననియు, సంస్థానాధిపతులు (సంస్థాన ప్రజలు కాదు) ఫెడరల్ రాజ్యాంగ శాసన సభలలో ప్రాతినిధ్యము కలిగియుండవలెనని వారు బెంగుళూరులో తెలిపినదానికి, వర్కింగు కమిటీ గాని వారి ఉత్తరముగాని కారణము తెల్పుట లేదు.

ఫెడరల్ రాజ్యాంగమునందు పౌరసత్వపు హక్కులు సంస్థానప్రజలకుండి, ఫెడరల్ కోర్టుచే సంరక్షింపబడునట్టియు, ఫెడరల్ శాసన సభయందు సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యముండునట్టియు రాజ్యాంగ విధానము కావలెనని కాంగ్రెసువారు పట్టుపట్టెదరా? దీనికి స్పష్టమగు సమాధానము మేము కోరునది.

రౌండుటేబిల్ సమావేశమునకు కాంగ్రెసు తరపున ఏకైక ప్రతినిధిగా వెడలి యుండిన గాంధిగారు, రౌండు టేబిల్ సమావేశమునం దొసగిన యుపన్యాసములందు పైరెండు అంశములు (సంస్థాన ప్రజా ప్రాతినిధ్యము, పౌరసత్వహక్కు) అంగీకరింపబడని రాజ్యాంగ విధానముతో కాంగ్రెసు తృప్తిపడజాలదని విన్నవించిరి. మహాత్ములు చెప్పినదానికి కాంగ్రెసు బద్ధముకదాయని మేము సంతసించుచుండగా భూలాభాయి దేశాయి గారి యుపన్యాసము ఆశాభంగము కలుగజేసినది. భూలాభాయి దేశాయిగారు అసెంబ్లీలో కాంగ్రెసు పార్టీ నాయకులు గాని సామాన్యులు గారు. వారే యిట్లు పలుకుచుండగా, సంస్థాన ప్రజలకు సందేహములు పొడముటలో ఏమిఆశ్చర్యము? గనుక సందేహనివృత్తి చేయుచు గాంధి గారి అభిప్రాయములను కాంగ్రెసు వర్కింగు కమిటీయైనను లేక అఖిలభారత కాంగ్రెసు కమిటీయైనను అంగీకరించి కాంగ్రెసు సమావేశమునందు తీర్మానముగా కొనివచ్చి అంగీకరింపజేయుట కర్తవ్యము. భూలాభాయి దేశాయిగారు తమ అంగీకారము తెలుపలేదు. అంతేకాని కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీ వచ్చువరకు ఏమియు నిర్ణయింప వీలులేదు, వేచియుండుడు అనుట బాగుండదు. ఏలన కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీనిగురించి ఊరక మాట్లాడుకొనుటేగాని దానినిర్మాణము, అది చేయవలసినపని మొదలగువిషయము లింకను నిర్ణయము కాకుండనే యున్నవి. కాబట్టి దానికొరకు వేచియుండక వెంటనే కాంగ్రెసు విషయమై తీర్మానించ వలెను. అప్పుడు భూలాభాయి గారు కోరినట్లు వాదోప వాదములు శమింప గలవు.

మధ్య ఇండియా సంస్థాన ప్రజా సమావేశమునకు కార్యదర్శులగు జయనారాయణ్ వ్యాస్ కన్హయాలాల్ వైద్యగార్లును గొప్ప జాతీయనాయకులగు కన్వార్ రణజిత్ సింగుగారును ఈ క్రింది ప్రకటన చేసిరి:—

కాంగ్రెసు వర్కింగు కమిటీ తీర్మానమును దేశాయిగారిలేఖను జాగ్రతగా చదివితిమి. సంస్థాన ప్రజలపట్ల కాంగ్రెసు తనవిధిని సరిగా నిరూపించలేదు.

దేశాయిగారి లేఖలో సంస్థాన ప్రజలను గురించి కొన్ని సానుభూతి వాక్యములు కలవు గాని మధ్య ఇండియా సంస్థానాధీశులకు బారొసగిన సలహాసలిగము అట్టి వాక్యములు తెలిపినమాత్రమున మాసిపోజాలదు. దేశాయిగారిబోటి ప్రజాకయములు లేసి ధనవంతుల తెగకుచెందిన కాంగ్రెసువాదులను వాకోట్ల సంస్థాన ప్రజల హక్కులకు భంగము కలిగించు మాటలాడకలదనియే మేము కోరునది. అట్టిమాటలవలన బ్రిటిషు భారత దేశమునకు సంస్థానములకు నిజమగు సఖ్యము ఐక్యము కలుగు అవకాశము తప్పిపోవును.

అఖిలభారత కాంగ్రెసు కమిటీయైనను వర్కింగు కమిటీవలెను, దేశాయిగారివలెను సిగ్గు నపులక, సంస్థాన ప్రజలపట్ల కాంగ్రెసు వైఖరిని స్పష్టముగా నిర్ణయించుగాక.

వర్కింగు కమిటి సభ్యులగు శార్దూలసింగుగారు పై ప్రకటనను గురించి అడుగగా ఇట్లు చెప్పిరి.—

గాంధిగారిని కాంగ్రెసు ఎన్నడును కాదనలేదు. వారుచేసిన వాగ్దానములు చెల్లించవలసిన విధి కాంగ్రెసునకు గలదు. గాంధిగారు రెండవ రౌండుటేబిలుసభలో సంస్థాన ప్రజలను గురించి తెలిపిన విషయములను వర్కింగుకమిటీ అంగీకరించును. అంగీకరించకపోవుట కధికారము లేదు.

గాంధిగారి వాగ్దానములు గూడ చాలనియెడల ఇంకేమి వారల తృప్తిపరచునో చెప్పజాలను. తృప్తిపడు నెడల గాంధిగారి వాగ్దానములను కాంగ్రెసు అంగీకరింపదని తలచి, మరల మరల నిర్ధారణలు కోరుట కవసరము కనుపింపదు. కాంగ్రెసు ఎన్నడును గాంధిగారిమాట లనదికాదని చెప్పలేదు.

భూలాభాయి దేశాయిగారిని కూడ కాంగ్రెసు చేయవలసిన తీర్మానమువంటి ప్రకటన చేయవలయునని కోరిరి. వారట్లు చేయునట్లు బలవంతపెట్టుటకు కాంగ్రెసున కధికారములేదు. కాంగ్రెసప్రత్యుల వా రిటీవల వ్రాసిన లేఖవలన అన్ని అపోహలు తొలగిపోవలసి యుండును.

కాంగ్రెసు వర్కింగుకమిటీ తీర్మానము అస్పష్టముగా నున్నదనియు, సంస్థానముల పట్ల ముభావముగా నుండు వైఖరి ఫెడరేషను రాకముందు చెల్లియుండునుగాని ఫెడరేషను వచ్చు ఈ సమయమున కాదనియు సంస్థాన ప్రజా సమావేశము తీర్మానించి, కాంగ్రెసువారీ క్రింది విధముగ సంస్థానములపట్ల తమ వైఖరిని స్పష్టపరుపవలెనని తీర్మానించిరి:—

౧. భారత సంస్థానములలో రాజకీయ కార్యక్రమము కాంగ్రెసు కొనసాగించుట.

౨. తనవద్ద డబ్బున్నంతవరకు ఆంగ్ల పరిపాలనలోనుండు భారతదేశభాగము, సంస్థానములు అనువిభేదము లేకుండ ఇట్టి కార్యక్రమము కొనసాగించును.

౩. డబ్బు చాలదను కారణము కొరకుతప్ప ఇతర కారణముల కొరకు సంస్థానములలో రాజకీయ కార్యక్రమము కొనసాగించుటను మానము.

౪. కాన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీ (సంపూర్ణాధికారము గల ప్రజా ప్రతినిధుల అసెంబ్లీ) ఏర్పడినపుడు దానిలో ఆంగ్ల పరిపాలనలోనున్న భారత దేశవాసులకు ప్రాతినిధ్య మొసగబడు నిబంధనలపైననే సంస్థాన ప్రజలకు ప్రాతినిధ్యము ఒసగవలెను. అట్టి అసెంబ్లీ ఏర్పడనివో ఇప్పుడు ప్రవేశ పెట్టబడుచున్న ఫెడరల్ రాజ్యాంగ విధానమును కాంగ్రెసంగీకరింపదు, సంస్థాన ప్రజలు నంగీకరింపరు. పై విధముగా కాంగ్రెసు తీర్మానించవలెనని సంస్థాన ప్రజా సమావేశమువారు కోరుచున్నారు.

సంస్థానములపట్ల కాంగ్రెసు వైఖరిని జరుగబోవు అఖిలభారత కాంగ్రెసు కమిటీ మీటింగులో చర్చకుపెట్టి, చర్చ జరుగు సమయమున తమ అభిప్రాయములను తెలుపుటకు సంస్థాన ప్రజల ప్రతినిధుల కవకాశ మొసగవలెను. మ.

—

## కొకుటవరా? టౌన్‌హాలా?

### రజతోత్సవ జ్ఞాపకచిహ్నము

(విలేఖరి) ఖమ్మం: 7-8-1935:- కొత్తపేటలో క్రొత్తగా నిర్మింపఁబడిన అగ్ర్వాం సాతేకుల కనకు చెందిన శ్రీ. వెంకటాద్రిగారి బంగళాపై నొక సభ చేయఁబడినదట. ఆసభలో పాల్గొనుటకై సుమారు రెండువందలమందికి ఆహ్వానలేఖలు పంపఁబడెనట. కాని సుమారు యిరువైమందితో సభ ఆరంభమైనదట. ఇందు జనాబుదువ్వంసా॥ గారును, తహసీలుదారుసా॥ గారును, యింతేజాఖాన్‌గుత్తేదారుసా॥ గారును, పుగ్గలతేజంగారును, పూర్ణయ్యగారును, మరి కొందరు న్యాయవాదులును, తదితరులును పాల్గొనిరట. మనప్రభువుగారి రజతోత్సవసందర్భమున జ్ఞాపకచిహ్నముగా ఏమి నిర్మించవలయునాయను ప్రశ్న ఉదయించినది. ప్రజాసేవకుడును, భాషాసేవకుడును నగు నొకరు గ్రంథాలయము నిర్మించవలయుననిరట. ఇంకొకరు టౌన్‌హాలు, మరొకరు క్లాకుటవర్, ఇంకొకరు గ్రామములో కోతులబాధ ఎక్కువగా నున్నది, పారతోలించమని, దీపమును సరిగా వెలిగించుటలేదు అది బాగుచేయించుమని ఒకరు, నీటికొళాయిలు అవసరమని మరొకరు, ఇట్లా అందరు తమతమ అభిప్రాయముల వెల్లడించిరి. చివరకు అన్నిటిని కొట్టివేసి క్లాకుటవరా, టౌన్‌హాలా, ఏదిబాగను విషయమునకు వచ్చినది. ఏదైనా బాగేకాని ఎవరు ఎట్లిట్లు చందాలు యిచ్చెదరను ధ్వని ఉదయించినది. వెంటనే వర్తకసోదరులు జవాబిచ్చారుగదా, మావాండ్లంతా లేరు, మళ్లీ వొక జనరల్ మీటింగు పెట్టండన్నారట. ఇంకెన్నిమాటలు జెప్పినా వాకేకి వచ్చునే. ఇంతటితో నేటిసభ ముగిసింది.

---

## ధర్మోపదేశము

శ్రీమాన్ పండిత్ భద్రదేవశర్మగారు మా గ్రామమునకు వచ్చి శ్రావణ శు॥ ౬ మరియు శ్రావణ శు॥ ౭ లు శివాలయమునందు వేదధర్మ ఆవశ్యకతగురించి ఉపన్యసించుచు యజ్ఞోపవీతధారణచే మనుష్యునిపై మూడు ఋణములు నుండుననియు, (మాతాపితృల ఋణము, దేవఋణము, ఋషి ఋణము) ఈఋణముల నుండి విముక్తి కొరకు మానవుడు బ్రహ్మచర్యమునుండి గృహస్థాశ్రమము, వానప్రస్థము సక్రమమార్గమున నవలంబించి వానిని జయప్రదముగా ముగించిన సన్యాసాశ్రమము ఆరంభము మగుననియు, ఈసన్యాసి పరివ్రాజకాచారి అని పిలువబడుననియు, (రాజులపై శాసనము చేయువాడు) ఆదినములు యిప్పుడు లేవనియు, మన ఈ అధోగతిని వేదధర్మమే పారదోలగలదనియు ప్రతిదినము రెండు గంటలు ఉపన్యసించిరి. ఈ రెండుదినములును ఈ ధర్మోపదేశమును వినగలందులకై పెక్కుమంది ఇచ్చటి వైశ్యసోదరులు, స్థానిక న్యాయవాదులు అందరును, ఇంకే యితర జనమును, స్త్రీలును విచ్చేసిరి. జనులు ఆహ్లాదమున మునిగిపోయిరి.

నోటు:—ఈసమావేశములు మ॥ రా॥ శ్రీ గుప్తవకీలుగారి యాజమాన్యమున జరిగినవని తెల్పుటకు మిక్కిలి సంతోషించుచున్నాము. ప్రథమ దినమున గుప్తగారు మనుష్యుని జన్మసాఫల్యము గురించి తెల్పవలయునో క్లుప్తముగా నుపన్యసించి జనుల ఆనందపరచిరి. తరువాత గుప్తగారు పురవాసుల పక్షమున భద్రదేవశర్మగారికి కృతజ్ఞతాభివందనములు తెలిపిరి. అటుపిమ్మట ప్రార్థనతో సభ శాంతముగా ముగిసెను. ఈరెండుదినములు సభ జయప్రదముగ జరిగెను. పోలీసువారు యెట్టి ఆటంకమును కలుగచేయలేదు. కాని ఒక కానిస్టేబిల్ వచ్చి ఒకమూలకు కూర్చొని యేమో వ్రాసుకపోయినాడు.

మిర్యాలగూడెము ఇట్లు,
శ్రీ వొరుగంటి అబ్బయ్య.
(వర్తకసంఘ సహాయకార్యదర్శి)

---

## అక్రమ రకముల భారము

### బిల్లకల్లు, కొండనాగోయి రైతుల మొఱ

(ఒక విలేఖరి)

అమరాబాదు తాలూకాలో చేరిన గ్రామములగు బిల్లకల్లు, కొండనాగోయి రైతులు హైకోర్టు వకీలగు ఒక స్థానిక కాంగ్రెసు నాయకునకు పంపిన ఒక లేఖలో తమపై రూ ౧౮౦౦ రకము ఖాయము చేయఁబడుటచే తాము అనుభవించవలసి వచ్చిన బాధలను వర్ణించుచున్నారు.

బిల్లకల్లు అనుగ్రామములో దసులు చెఱువు అను గొప్ప చెఱువు గలదు. ఇది పర్వతప్రాంతములలో నున్నది. వానకాలములో యీ చెఱువు నీటివలన శీత జ్వరములకు భయపడి అక్కడ దున్నేటట్లులేదు. ఇదివరకు చాలమంది యీశీత జ్వరముల వాతబడి మరణించిరి. పండినపంట వచ్చిన రోగములకు మందుకు సరిపోవును. సర్కారురకములకు మరెక్కడనుంచియైనను తెచ్చి కట్టవలసినదే.

ఇటువంటి చెరువుకు గిర్దావరు గారును, పట్వారి గారును కలిసి ఆలోచించి "రూ ౧౮౦౦ ల రకము బిలాపర్షూ పడావ" పెట్టినారు. ఈ భయముతో ఆసేపులు వేసంగి మొత్తము పొలము దున్ని రోగముపాలైరి. అందు కొంతమంది మరణించిరి. వేసంగిపండిన పంటలు సర్కారురకములకుసరిపోక యిదివరకు పెద్దలు సంపాదించిపెట్టిన వస్తువుల నమ్మి రకములు కట్టఁబడెను.

ఈ బిలాపర్షు పడావరకము మొత్తమును పట్వారిగారు సదరు రైతులకు తెలియజేయక ముందే తహశీలు జమాబందిలో ఖాయము చేసిరి. తర్వాత డివిజన్ జమాబందిలో ఖాయము చేసి రైతులకు తెల్పగా, ఆరైతులు డివిజన్ దువ్వంతాలూక్దారువద్దకుపోయి మొర పెట్టుకొనిరి. కాని ఆ మొరలు యెవరును వినలేదు. అక్కడినుండి రైతులు జిల్లా అవ్వల్ తాలూక్దారుగారి వద్దకు వచ్చి వకీలుద్వారా మురాఫా విజ్ఞప్తిని సమర్పించుకొనిరి. అవ్వల్ తాలూక్దారుగారు మురాఫ విచారకుదీసికొని తహశీలుకు పడావరకము విచారించవద్దు అని ఆజ్ఞ దయచేసిరి. అట్టి ఆజ్ఞపై తహశీలుదారుగారు రకము విచారించక యుండిరి. కాని రైతులవద్ద జమాబందిపత్రములు లేనందున, ఆ కాగితములు తేవలసినదని చెప్పి విచారణ వాయిదావేసిరి. ఆ కాగితములు ఆరైతులకు తహశీలులో దొరకనందువలన వారు సరిగా వాయిదాపరాలేదు. అందు వలన మురాఫ కొరజా అయినదట. రైతులు నెమ్మదిగా కాగితములు సంపాదించుకొని వచ్చి మరల "నిగుచాని" చేసిరట. కాని అది నామంజూరి చేయఁబడినదట.

ఇట్లువివరించి తుదకు, "మేము కడు బీదలము. మాకు పూటకిలేక ఉపవాసము లుంటున్నాము. అధికముగ శ్రమపడుచున్నాము. ఈ దినములలో మాకు సాహుకార్లు అప్పలిచ్చుటలేదు. సర్కారురకాలనే, మాదగ్గరవున్న ఆస్తులను విక్రయించి అనేకవిధముల శ్రమపడి కట్టుచున్నాము. ఇప్పుడు యిట్టి రకాలకు మేము యిండ్లు విడచిపోవలసియున్నది. ఇంతకు మావద్ద చేరేగుంజాయిషీలేదు. ఈ చెరువు వెనుక భూములు మొత్తము ఒకపసలా ఉన్నవి. అట్టి ఒక్కపసలా రకం మొత్తము కట్టియున్నాము. .........ఇప్పుడు తహశీలునుంచి జవానులు, గిర్దావరు సదరువారు రకాల నిమిత్తము... మాదున్నేవస్తువుల జప్తి చేయుచున్నారు. కావున తమరు దయచేసి మాబాధలు జెల్దీ తప్పించగలరని మనవి" అని ప్రార్థించినారు. ఈ లేఖలో ౬నుండి నిషానులును, ౪ గురి సంతకములును గలవు.

---






# గోలకొండపత్రిక

యువ సం. శ్రావణ బ॥ ౬

సోమ వారము


## ఫ్రెంచి, జర్మనీ భాషలు నేర్పుట

ఉస్మానియా విశ్వవిద్యా పీఠము యొక్క ప్రోవైస్ ఛాన్సెలరుగారు అడ్డిగమెట్టులో నుండు ఆ విశ్వ విద్యాలయ కళాశాలలో సాధారణముగా జరుగుపని ప్రారంభమగుటకు ముందు (అనగా ౯॥ గం॥ మొదలుకొని ౧౦॥ గం॥ వరకు) గాని లేక అది ముగిసిన తర్వాత ౪ గం॥ మొదలుకొని ౫ గం॥ వరకు గాని వారమునకొకసారి ఫ్రెంచి, జర్మనీ భాషలు నేర్పుటకు యేర్పాట్లు చేయుచున్నారు. ఈ భాషలు నేర్పుటకు యిప్పుడు విశ్వవిద్యాలయ కళాశాల పనిచేయు కాలములోనే కొంత యేర్పాటుకలదు. కొలది కాలము నుంచి యీ భాషలు నేర్చుకొన దలచిన విద్యార్థులకు నేర్పబడుచున్నవి. కాని ఇంతవరకు ఈ సౌకర్యము కళాశాలలో క్రమముగా ఉదయము నుంచి సాయంకాలము వరకు చదువు ఒక విద్యార్థులకే మాత్రమే. ప్రోవైస్ ఛాన్సెలరుగారికి అంతటితో తృప్తి లేదు. విశ్వవిద్యాలయములో చేరనివారికిగూడ ఆభాషలు నేర్చుకొనగోరువారికి సౌకర్యము కలిగించి, విశ్వవిద్యాలయములో చేరినవారికిని, విశ్వవిద్యాలయములో చేరియుండనివారికిని సంబంధము కలిగించవలెనని కుతూహల పడినారు. కాబట్టి విశ్వవిద్యాలయ కళాశాల పని చేయునప్పుడు నగరములో వివిధ ప్రభుత్వ కార్యాలయములును, యితర కార్యాలయములునుకూడ పనిచేయుచుండునవియు, ఆ సమయమున నగర జనులందరు వారి వారి జీవయాత్ర సంబంధమైన పనులలో మగ్నులై యుందురనియు, కళాశాల ప్రారంభించుటకు ముందుగాని, పని ముగించిన తర్వాతగాని తక్కిన కార్యాలయములపని కూడ సాధారణముగా ముగిసియుండుటచే జనులకు విజ్ఞాన సంపాదనకు తీరికగా నుండుననియు యోచించి అట్టి తీరిక కాలములో ఆతరగతుల నేర్పాటుచేసినారు. సంసార తాపత్రయముచే చుట్టుకొనబడినవారికి ప్రతిరోజు అడ్డిగమెట్టువరకు పోయి వాటి ఉపయోగము తెలియని విదేశభాషల నేర్చుకొనుటకు యేమి ఉత్సాహముండునని ప్రతిరోజును ఆ తరగతుల నేర్పాటుచేయక వారమున కొకపర్యాయము మాత్రమే యేర్పాటు చేసినారు. ఆరోజు ఈ హైద్రాబాదు నగరమున సాధారణముగా అనేక కార్యాలయములకు సెలవురోజగు శుక్రవారమై యుండిన చాల అనుకూలము. బహుశః ప్రోవైస్ ఛాన్సెలరుగారు ఆరోజే యేర్పాటు చేయవచ్చును. మఱి యీ తరగతులలో చేరదలచువారికి ఫీజు ఏమి యేర్పరతురో తెలియుటలేదు కాని ఫీజు యేర్పాటులేకుండ ఉచితముగా నేర్పబడుచో ఆప్రయత్నము మఱి కొంత మెచ్చుకొనబడవలయును.

ఫ్రెంచి,జర్మనీభాషలవలన మనకేమి ప్రయోజనము అని పలువురు అడుగవచ్చును నిజముగా ఆభాషలు నేటి అంతర్జాతీయభాషలలో గొప్ప ప్రాముఖ్యము గల భాషలు. ప్రపంచమందలి వివిధ దేశములమధ్య వాణిజ్య,వైజ్ఞానిక, ఆర్థిక స్వరూపమగు అంతర్జాతీయ సంబంధము హెచ్చుచున్న రోజులు యివి. కాబట్టి యీరోజులలో అంతర్జాతీయములైనట్టి ఆభాషలవిలువ యెంతో గ్రహింపవచ్చును. ప్రపంచములో ౮౦౦౦౦౦౦౦ మందికి మాతృభాషయగు జర్మనీభాషయు, ౭౦౦౦౦౦౦౦ మందికి మాతృభాషయగు ఫ్రెంచిభాషయు నేటిప్రపంచమందు పారిశ్రామికులకును,విదేశవాణిజ్యము చేయువారికిని, సైన్సులో రోజురోజుకు కనిపెట్టబడుచుండు నూతన విషయములను యెప్పటికప్పుడు తెలిసికొనగోరు శాస్త్రపరిశోధకులకును తెలిసికొనియుండదగిన భాషలైయున్నవి. మన దేశమున నిప్పుడు నిరుద్యోగము యొక్క శాశ్వత ఉపశాంతికి పారిశ్రామికాభివృద్ధి అవసరము. పరిశ్రమలకు సంబంధించిన నవీన విజ్ఞానము నేర్పు సౌకర్యములు ఫ్రాన్సు దేశములోను, జర్మనీ దేశములోను, అమెరికా దేశములోను యెక్కువ. మన దేశమును డికొందరు ఆ దేశములందు పారిశ్రామికవిద్యను జదివి వచ్చి యీ దేశమున పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటకు ప్రభుత్వము వారును ప్రజలును సహాయపడవలసి యున్నది. ఫ్రాన్సు, జర్మనీ దేశములలో ఆ దేశ భాషలు రానిచో అక్కడివిద్య నేర్చుకొనుట కష్టము. సైన్సు, పారిశ్రామిక సంబంధములగు పత్రికలెన్నియో ఆ భాషలలో నుండు వాటిని ఆ భాషలు తెలిసిన దేశీయులుపయోగించి దేశమునకు లాభము చేయవచ్చును అంతర్జాతీయ విజ్ఞాన సహకారమువలన కలుగు లాభములను ప్రతివారును అంగీకరింతురు ఇక ప్రధాన కావ్యములైన అంతర్జాతీయ భాషలగు జర్మని, ఫ్రెంచి భాషలు ఆ విజ్ఞాన సహకారమునకు యెంతతోడ్పడునో వేఱుగ చెప్పనక్కరలేదు.

కావున ఇట్టి ప్రాముఖ్యము గల భాషలను జనులకు తీరికసమయములో నేర్పుటకు యేర్పాటుచేయుట ప్రశంసనీయమైన యత్నము. ఈ అవకాశమును మనవారు వ్యర్థముగా పోనీయక ఉపయోగించుకొని లాభము పొందెదరు గాక!

## లాహోరు అందోళనము

### కలకత్తా మహమ్మదీయుల తీర్మానములు

ఆగస్టు ౧౨వతేది షాహీద్‌గంజ్ మసీదు వ్యవహారములను చర్చించుటకు కలకత్తాఖిలాఫతు కమిటీవారియాజమాన్యమున కలకత్తాపురమందిరమునందు మహమ్మదీయులసభజరిగెను. సభవారు ఈక్రిందితీర్మానములగావించిరి.

మసీదుండినస్థలమును ప్రభుత్వమువారు వశపరచుకొనవలెను.

మసీదులు యెవ్వరియొక్కయు స్వంత ఆస్తిగా పరిగణింపబడజాలవని ప్రభుత్వమువారు స్పష్టము చేయవలెననికోరుట. మసీదుల స్వరూపము మార్చుటకుహక్కు లేదని సభవారు తలచిరి.

మసీదుండినప్రదేశమును మహమ్మదీయులకొసంగవలసినదని సిక్కులను కోరుటలేదు. ఆప్రదేశమును ఖాళీగానుంచవలెను.

జూలై ౨౧వ తారీఖున మహమ్మదీయజనసమూహములపై ప్రభుత్వమువారు కాల్చినందులకు అసమ్మతి నిలుపుట.

మసీదులను, మతసంబంధమైనకట్టడములను రక్షించుటకు ఒకసంఘమునునియమించుటకు సభవారునిశ్చయించిరి. ఇందువిషయమై తగుచర్య గైకొనుటకు హుస్సేన్‌షాహుస్సేద్దీన్, అబ్దుల్ రాఫ్ గారలు కోరబడిరి.

## ఆఫ్రికాలో భారతీయుల దుస్థితి

### ఆండ్రూస్‌గారి ఆదుర్దా

దీనబంధు సి. ఎఫ్. ఆండ్రూసుగారు ఆగష్టు ౧౭వ తేది బొంబాయి దయచేసిరి. వారు నాడు సాయంత్రము వరకు వారచటనుండి తరువాత అహమ్మదాబాదు వెళ్లిరి. ఆండ్రూసుగారు ౧౭వ తారీఖున ఆంగ్ల దేశమునకు బయలుదేర దలచియుండిరి. కాని వారు ఆనాడు ప్రయాణము మానివారు. ఆగస్టు ౨౪వ తారీఖున బయలుదేరి వెళ్లుదురు.

ప్రత్యేకముగా యునైటెడ్ ప్రెస్ ప్రతినిధితో తన యభిప్రాయమును వెల్లడించుచు, తాను కెన్యా జాంజిబారు భారతీయుల స్థితి విషమమగుచున్నదని ఆండ్రూసుగారు చెప్పిరి. కెన్యాలో మార్కెట్లకు సంబంధించిన శాసనము విషయమునను, యుద్ధభయమువలన భయభ్రాంతులగు అబిసీనియా భారతీయుల విషయమునను తాను విచారణ గావించుచున్నానని ఆండ్రూసుగారు చెప్పిరి.

కెన్యా పీఠభూములను యూరోపియనులకు ప్రత్యేకించుట అనర్థదాయకమనియు, ౧౯౨౩ సం॥లో బ్రిటిషు ప్రభుత్వమువారు గావించిన వాగ్దానములకు విరుద్ధమనియు ఆయన చెప్పెను.

## ప్రాచ్య విజ్ఞాన మహాసభ

డిసెంబరు మాసములో బెంగుళూరు నగరమున జరుగు ప్రాచ్యవిజ్ఞానసభకు [ఓరియంటల్ కాన్ఫరెన్సు] బరోడా ప్రభుత్వమువారు ప్రతినిధులనునిర్ణయించినారు.

## నాయబుకోత్వాలు

నాయబుకోత్వాలుగారగు హమ్యాజక్ష్ గాఫ్ గారు అనారోగ్యముగనున్నందున సికింద్రాబాదు మతిసుపత్రిలో ఔషధము తీసికొనుచున్నారు.

## చాదర్‌ఘాట్ స్కౌట్సు సంఘము

౩ మెహారు రెడ్డిబోర్డింగులో చాదర్‌ఘాటు స్కౌటుబాలుర సభజరిగెను. ఆ సభలో చాలమంది స్కౌటుమాస్టర్లుగూడ పాల్గొనిరి. ప్రారంభములో రాజాబహదూరు వెంకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారు కొంతసేపటివరకు అధ్యక్షత వహించిరి. కాని వారికి అత్యవసరమైన పనులు ఉండుటవలన వారు సెలవుతీసికొనిరి. వారు వెళ్లినతదుపరి జిల్లాస్కౌట్సుకమీషనరగు మౌల్వీ సయ్యదుఅలిఅక్బరుగారు అధ్యక్షత వహించిరి. ఈక్రిందికార్యక్రమము జరిగెను.

(౧) గతసభయొక్క సభాచర్యలు చదువబడెను. సభ్యులు కార్యదర్శిగారిని సంఘమునకు సంబంధించిన హైద్రాబాదుకమిషనరుగారికి మరియు ఇతర సభ్యులకు చూడవలసిన ఎన్నికలపై విచారము చేయుటకు వ్రాయవలయునని కోరిరి.

(౨) జరుగుచున్న సంవత్సరము జరిగిన ఉపన్యాసములు మరియు వివాద ఉపన్యాసములను గురించిన కార్యక్రమము ఏర్పరచబడినది.

(౩) ఈసంవత్సరసభకు అధ్యక్షతను అంగీకరించినందున రాజాబహాదురు వెంకటరామారెడ్డిగారికిని మరియు సయ్యదుఅలి అక్బరుసాహెబుగారికిని కృతజ్ఞతావందనములు తెల్పబడెను.

## న్యాయ శాఖలో సంస్కరణములు

మ.ఘ.వ. ప్రభువుగారి అంగీకారముతో న్యాయశాఖా పరిపాలనమున కొన్ని సంస్కరణములు జరుగునని తెలియుచున్నది.

౧. ఇకముందు హైకోర్టు జడ్జిపదవికి బారిస్టరు, విశ్వ విద్యాలయములలో ఖానూని డిగ్రీ పొందినవారును, ప్రత్యేకముగా న్యాయస్థానముల పనికొరకు సిద్ధపరుపబడిన ఎచ్.సి. యస్. అనువారు తప్ప ఇతరులను సిఫారసు చేయకూడదు.

౨. న్యాయస్థానము తనిఖీ చేయు అధికారి హైకోర్టుజడ్జికి కలయు యోగ్యత గలవాడుగా ఉండవలెను.

౩. సదరు ఆదాలతు న్యాయాధిపతులు ౫గురిలో అర్ధమువ్వగురు పైన పేర్కొనబడిన యోగ్యత కలిగి యుండవలెను. ఒకరు అట్టి నిర్బంధములులేక తగినసమర్థత కలవారైయుండిన చాలును.

౪ సూబాల యొక్కయు, జిల్లాలయొక్కయు అదికసాలిములలో ముఖ్యులగు ౧౨ గురు పైయోగ్యత కలిగియుండుట అవసరము.

౫. మొత్తము అన్నివిధములగు న్యాయాధిపతులలో ౨౧ ఉద్యోగములు ప్రత్యేక స్వరక్షణబెట్టి, పైనిర్బంధములతో పనిలేక, నియోగింపబడదగినవై యుండవలయును.

౬. న్యాయస్థానముల యొక్క ప్రారంభ అధికారములపైన అసమర్థులను నియోగింపు పద్ధతి పూర్తిగా ఆపివేయబడినది

# వింతలు విశేషములు

## రైలుప్రయాణముకంటె చౌకప్రయాణము

హెర్ క్రోణ్ఫెల్డు అను ఆస్ట్రియా దేశీయుడు ౫అశ్వశక్తులు [Horse Power] గల ఒక క్రొత్తయింజను నొకదానిని కనిపెట్టినాడు దీనివలన విమానములో ప్రయాణము రైలు ప్రయాణముకంటె, ఒన్సుప్రయాణముకంటెను గూడ చౌకయగుకాలము సమీపములో నున్నదని ఆశకలుగుచున్నది హెర్ క్రోణ్ఫెల్డు గారు తమయంత్రమును ఫ్రాన్సుదేశములోని పట్టణములలో చూపించినారు ఇంగ్లీషు కాలువపైగా మైళ్ళదూరము ప్రయాణముచేయుటకు వారికి పెట్రోలుఖర్చు ఆయిలుఖర్చు ఒకరూపాయ అయినది ప్రయాణము ౪౦ నిమిషములలో ముగించబడినది వారీయంత్రమును యింగ్లండులో ప్రభుత్వ విమానాధికారులకు చూపించి వారిఅభిమానమును సంపాదించుకొనుటకై అక్కడకొంతకాలము ఉండగలరు ఈయంత్రనిర్మాణమునకగుఖర్చులో నూటికిరువది వంతును ఫ్రెంచిప్రభుత్వమువారిచ్చుటకు అంగీకరించినారు ఈసహాయముతో ఒక్కొక్క యంత్రమును ౧౫౦ పౌనుల ఖరీదుకు అమ్మవచ్చును

---

## పిల్లికూనలను తయారుచేయుట

డా॥ వు లిండ్బర్గుగారు గాజుతో ఒక గుండెను చేసి ఆగుండెసహాయమున ప్రాణములు ఉపయోగించగలగునని వారు సాధించినట్లు యిదివరకు కొద్దిగా తెలుపబడియుండెను ఇప్పుడు మరికొన్ని విశేషములు తెలిసినవి

ఇందులో రహస్యమేమన ప్రాణుల [పశువులేగాక వృక్షములుకూడ] విచ్ఛిన్నాంగములకు మెనచెప్పిన గుండె తగిలించబడును ఈగుండెతోగూడ ఊపిరితిత్తులును రక్తనాళములను కూడ ఉండును రక్తనాళములలోనికి నెత్తురు జీవపదార్థములు [విటమిన్లు] మొదలగు పోషకరసములు పంపుతో యెక్కించబడును నెత్తురులోనికి నూటికి ౪౦ పాళ్లు ప్రాణవాయువు (ఆక్సిజన్) ౩పాళ్ళు బొగ్గుపులుసు వాయువు [కార్బన్ డయాక్సైడ్] తక్కినభాగము నత్రజనివాయువు (నైట్రోజన్) పంపుచేయబడుట చే ఊపిరితిత్తులు శుభ్రముగానుండును ఈ అంగములన్నియు ఒకపొదుగుసాధనము [ఇన్క్యుబేటర్] యొక్క సహాయమువలన సాధారణముగ ప్రాణుల శరీరములలో నుండె ఉష్ణోగ్రతలు మొదలగు అంగములు యెట్లువేడిగానుండునో అట్లే వేడిగ నుంచబడును

ఈయంత్రముతో డాక్టరు లిండ్బర్గుగారును నోబెల్ బహుమతిపొందిన డాక్టర్ అలెక్సిస్ క్యారల్ గారును పిల్లులయొక్కయు కోడిపిల్లలయొక్కయు గుండెలను మూత్రపిండములను స్త్రీపుంస గ్రంథులనుగూర్చి పరిశోధనలజేసినారు ఈపరిశోధనలవలన వారికి ప్రాణుల శరీరములలోనిఅవయవములు ఆకారమునందును పరిమాణమునందును రోజురోజునకు వృద్ధిజెందునట్లు కనపడినది అయిదురోజులలో గర్భాశయముయొక్క బరువు ౯౦ మిల్లిగ్రాములనుండి ౨౦౦ మిల్లిగ్రాములకు హెచ్చెను గర్భాశయముపై అనుపచ్చనివచ్చలు కనుపించుటచే పరిశోధకులు తల్లిలేని గ్రుడ్డునుండి కోడిపిల్లనుగాని పిల్లిపిల్లలనుగాని ఉత్పత్తిచెయుట సాధ్యమగునని ఆశించుచున్నారు

---

## అంపపు పొడినుండి ఆల్కహాలు

సోవియట్ రష్యాలో నిప్పుడు చక్కెర నుండియు, అంపపుపొడినుండియు ఆల్కహాలును అధికముగా ఉత్పత్తిచేయుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి తెల్లసముద్రముమీద ఆర్కేంజెలువద్ద ఒక హైడ్రాలిసిస్ యంత్రము స్థాపించబడుచున్నది సంవత్సరమునకు సుమారు ౪౦౦౦౦౦౦ గాలనుల ఆల్కహాలును తయారుచేయగల మరిరెండుయంత్రములుగూడ స్థాపించబడుచున్నవి

---

## మనుష్యస్త్రీకి కోతిపుట్టుట

ఉత్తర హిందూస్థానములోని జయపూరు సంస్థానమందు పాలకులగ్రామములో హోక్ సింగ్ అనువతనిభార్య తొమ్మిదినెలలు గర్భము మోసి శ్లాఘ్యగా చచ్చిపోయిన కోతిపుట్టినది కోతి గర్భములోనే మరణించి యుండెనట ఆమె ప్రాణాపాయస్థితిలో నున్నది దయ్యమే మోయుచున్నదని ఆమెబంధువులు భూతవైద్యము చేయించుచున్నారు

---

## తెల్లజాతిఅధికారి మరొక అధికారి యింటిపై పెద్దబండ వేయుట

సిమ్లాలో సాధారణముగా ప్రభుత్వోద్యోగుల నివాసములుండువోట శాంతముగానుండును అట్టి శాంతప్రదేశమున సైనికశాఖ ప్రధాన కార్యాలయములో పనిచేయు ఫోర్డుగారు శాసనసభాశాఖలో పనిచేయు టి యం పాల్ గారింటిపై పెద్ద బండను వేయుటవలన గొప్ప అల్లరిలేచెను

పాల్ గారు వెంటనే అవిఎయుమై డిప్యూటీ కమిషనరుకు తెలియచేసి న్యాయమూర్తిగారు ఆలోచించినవాటన్ను ... పాల్ గారు విందునొసగి తమకూతురుచేత నాట్యమాడించుచు విందుకు వచ్చినవారికి ఆనందము కలిగించుచుండిరి చుట్టుప్రక్కలవారు గొప్పగొప్ప స్త్రీపురుషులు విందుకు వచ్చియుండిరి నాట్యము జరుగుచుండగా ఆయింటపై కప్పుగానుండు ఇనుపరేకులపై దుముడుమూయని విచారించగా అదేదో బండ పడుట వలన కలిగినదని కనపడెను అది ఫోర్డుగారింటిపైనుండి వచ్చినట్లు కనుగొనుటచే చుట్టుప్రక్కలవారందరు ఫోర్డుగారింటికి చుట్టుకొని సమాధానముకోరిరి అతడు "నేను తెల్లవాడను ఈసంగీతముచే నాబిడ్డ నిద్రపోలేకున్నది కావునరాయివేసి సంగీతము నాపుటకు నాకు స్వాతంత్ర్యముగలదు" అని జవాబిచ్చెనట

---



## ఒక్క అణాతో పెండ్లిండ్లు జరుపుట

పశ్చిమ ఖాందేష్‌లో ఒక గ్రామమందు ఒక మహాశయుడు ప్రతిసంవత్సరము ఒకదేవతను స్థాపించి ఆదేవత సమక్షమున గ్రామస్థులను పెండ్లిండ్లు జరుపుకొనవలసినదని కోరుచుండెను అట్టిపెండ్లిండ్లు జరిగినందుకై ఒక్కొక్క పెండ్లికి రూ ౩లు మొదలుకొని రూ ౧౫లవరకు ఛార్జిచేయబడెను ఈప్రకారముగా ఆ మహాశయునికి ప్రతిసంవత్సరము సుమారు రూ౫౦౦లవరకు వసూలగుచుండెను ఆప్రాంతమున గ్రామోద్ధరణోద్యమములో పనిచేయుచున్న శ్రీయుత బాలాభాయి మెహతా గారు యిదిచూచి గ్రామస్థులనుండి యింతమొత్తము దేనికిపోవలెనని తలచి ఆగ్రామపంచాయతీవారిచే మరియొకదేవతను స్థాపనజేసి ఆదేవత ఎదుట పెండ్లిండ్లు జరుపుకొనువారు యేమియీయనుగాని చెల్లింపనక్కరలేదని ఆగ్రామస్థులకేగాక చుట్టుపట్టు గ్రామములవారికిగూడ తెలియజేసిరి ఇట్టివివాహములు ... ఒక్కొక్క వివాహమునకు తాళిబొట్టు వారు ఖర్చు ఒకఅణాదప్ప మరేమియు ఖర్చుండదు ఈ విధముగ ఆరురూపాయలు క్రమేపీ దేవతపేర వసూలయ్యెను ఆ ఆరురూపాయలను మెహతాగారు గ్రామపంచాయతీకి జమకట్టించిరి

---

ఆంధ్రులకు
౭౦ లక్షల నిజాం
రాష్ట్రాంధ్రుల అభిగ్ర
హక ముఖ్యసాధనము
గోలకొండ పత్రికా
పోషణము

# గోలకొండపత్రిక

వర్తకులకు
నిజాంరాష్ట్రపు పదిమిది
జిల్లాలలోని ఆంధ్రుల
లో వ్యాపారకవృద్ధిక
సాధనము? గోలకొం
పత్రికలో ప్రకటనగు

సంపుటము 10 | ఆగష్టు 19 వ తేది 1935 సం॥ సోమవారము | సంచిక 29

# హిందూమతమునకు మరణమాసన్నమైనదా?

## పచ్చయప్ప కళాశాల ప్రిన్సిపాలుగారి ఉపన్యాసము

[పచ్చయ్యప్ప కళాశాలాధ్యక్షులగు ప్రొఫెసరు పి.ఎన్. శ్రీనివాసాచారిగారు మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ఆగష్టు ౧-వ తేదిసాయంత్రము, కళాశాల విద్యార్థి సంఘ సమావేశ ప్రారంభోత్సవ మొనర్చుచు, హిందూమత పరమార్థమునుగురించి ఉపన్యసించిరి. ఆ యుపన్యాస సారాంశము దిగువనొసగఁబడినది]

హిందూమతమును పలువురు పలువిధములుగ నిర్వచించుచున్నారు. ప్రతికూల విమర్శకులగువారు కొందరు, హిందూమతము పరస్పరవిరుద్ధములగు అనేకసిద్ధాంతములతో నిండియున్నదని పల్కుచుందురు. ఒకవైపున ఏకేశ్వర సిద్ధాంతము, మరియొకవైపున బహుదేవతారాధనము; ఒకవైపున నీతివర్తనము మరియొకవైపున అట్టి నియమము లసత్యములను సిద్ధాంతములు—యిట్టివే పరస్పర విరుద్ధములగు విషయములు గలవు.

కర్మసిద్ధాంతము వలన, హిందూమతమునకు ప్రజలు నిరుత్సాహులై పురుషప్రయత్నరహితులై, వ్యక్తులనట సంభవించుచున్నది. వర్ణాచారసిద్ధాంతమువలన ప్రజలు ఐకమత్యము కోల్పోయి, ఎవరికివారే దుర్బలులై పెరుగవలసి వచ్చుచున్నది. హిందూమతము నందు సహజసిద్ధమగు నీదౌర్బల్యమువలన హిందూసంఘము దినదినమై క్షీణించిపోవుచున్నది. కొన్ని శతాబ్దముల పూర్వము ప్రపంచమున హిందువులసంఖ్య కోట్లుండెడివట. నేడది సగముకంటె ఎక్కువగ తగ్గిపోయినది. హిందూమతము అన్యమతముల దాడికోర్వజాలక తనసంఖ్యలను గోల్పోయెను. ప్రాపంచికజీవితమందన్యమతములబలమునాపశ్యమవలేదు. అన్యమతములలో ఇతరమతములను తమలో నికిమార్చుకొనుటకు వీలుగలదు, హిందూమతమునకట్టిది నిషిద్ధము. ఇందువలనను పాశ్చాత్యవిజ్ఞాన ప్రవాహమువలనను, హిందూమతము, కొలదికాలములో, ప్రపంచమున నామమాత్రముగూడలేకుండబోవునని పలువురు విమర్శకులు పల్కుచుందురు. హిందూమతము కేవలము వేదాంతసారమనియు, కేవలము కొలది గ్రంథములు మాత్రమే దానిని తెలిసికొని అవలంబింపగలరుగాని ప్రజాసామాన్యమునకు అందనిదనియు, ఇది వరకెట్టి ధీశక్తికలవారునైన గ్రీకు, రోమకవిజ్ఞానములంతరించినట్లే, భారతవిజ్ఞానము కాలక్రమమున నంతరించుననియు వారి యభిప్రాయము.

కాని అట్టివారి వాదములు నిజముగాదు: హిందూమతము సనాతనమైనది. అందుచేనే సృష్టియున్నంతవరకేమతము చిరస్థాయిగనుండగిలదు. అట్టిదివ్యతేజస్సు హిందూమతమునందు గలదు. కేవల వైదికసాధనమగు విద్యావిధానమును వ్యాపించియున్న నేటికాలమునగూడ, వేలకొలది మహాత్ములు, ఋషులు మనదేశమున గన్పించగలరు. అది హిందూమతజీవసత్వమునకు చిహ్నముగాని దౌర్బల్యమునకుగాదు. హిందూమతము కడు ఉదారమైనది. అది దుర్బలమని భావింపరాదు. హిందూమతము పుక్కిటి పురాణగాథలమూటయని అన్యమతస్థులు కొందరు పల్కుచుందురు. పురాణగాథలు ప్రతిమతమునందు గలవు. పురాణములు లేనిమతములు లేవు. క్రైస్తవ, మహమ్మదీయ మతములలోగూడ గలవు. హిందూమతమునగల కర్మకాండను గురించిన విమర్శలనుగూడ నిదియే వర్తించును. క్రైస్తవమతము, మహమ్మదీయమతము రుదుకు బౌద్ధమతమునందు గూడ కర్మకాండగలదు. కనుక నివిలోపములే యైనయెడల, విమర్శకుల మతములయందుగూడ నున్న లోపములేగాని ప్రత్యేకమైనవిగావు. జీవాత్మ, పరమాత్మ, జగత్తుల ఐక్యమును వెల్లడించుటచే, హిందూమతము పరమోత్కృష్టమైనది.

హిందూమతము కేవలము మానవజీవితమును గురించిన సిద్ధాంతముల సముదాయముగాదు. అది సంస్కారపూర్వకమగు జీవిత ప్రవృత్తి. హిందూమతము జీవులయందు పరిపూర్ణమగు నాత్మజ్ఞానమును సిద్ధింపచేయుచున్నది. ఇతరమతములు మానవ సౌభ్రాతృత్వమునే ప్రతిపాదించుచున్నవి. హిందూమత మొక్క-మానవుల సౌభ్రాతృత్వమునేగాదు, చరాచరమగు సకల జీవకోటియందలియొక్క-యు సౌభ్రాతృత్వము ప్రకటించుచున్నది. జగత్తంతయు భగవన్మయమని చాటుచున్నది. మరి యేమతమందును ఈ పరమార్థము ప్రతిపాదింపబడియుండలేదు. భగవంతుడెక్కడనో యుండునని భావించి ప్రార్థనలుగావింపక, తనశరీరమందు ప్రతియణువునందును వ్యాపించియున్న భగవంతుని నిజస్వరూపమును కనుగొనుమని బోధించుచున్నది. ఆధునిక విజ్ఞానశాస్త్రజ్ఞులు నేడింకను తెలిసికొనజాలక ప్రాకులాడుచున్న సృష్టి రహస్యమును హిందూమత మెన్నియో వేల సంవత్సరముల నాడే కనుగొని, సృష్టియంతయు పరమాత్మ



(౧౧వ పేజీ చూడుడు)

సినిమానటి మిస్ సులోచన

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K Balakrishna Reddy